శ్రీరస్తు.

బమ్మెరపోతనామాత్యప్రణీత

శ్రీమదాంధ్ర మహాభాగవతము నందలి

# సప్తమస్కంధము.

ఇది,

తెనుఁగుభాషఁజదువుకొను బాలురకు

నత్యంతోపయుక్తంబగునటుల

అల్లాడి నారాయణశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి

రామానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించిప్రచురింపఁబడియె.

చెన్నపురి,

1904

# శ్రీరామానంద ముద్రాక్షరశాలయందువిక్రయించు

## పుస్తకముల జాబితా.

| | |
|---|---|
| సేనానీచరిత్రము | ౦ ౩ ౦ |
| గురుబాలప్రబోధిక | ౧ ౮ ౦ |
| తె॥ ఇందసభా | ౦ ౧౨ ౦ |
| సుజ్ఞానామృతతారావళి | ౦ ౪ ౦ |
| పురశ్చరణదీపిక | ౦ ౪ ౦ |
| అష్టోత్తరసహస్రనామకదంబము | ౦ ౮ ౦ |
| స్కాందమాఘపురాణం | ౦ ౮ ౦ |
| కాలామృతం | ౦ ౪ ౦ |
| నక్షత్రచూడామణి | ౦ ౪ ౦ |

పాకెట్టురాయల్ ౩౨ పేజీలలోయుండు గ్రంధములు

| | |
|---|---|
| విష్ణుసహస్రనామము | ౦ ౭ ౦ |
| లలితాసహస్రనామము | ౦ ౬ ౦ |
| శివసహస్రనామము | ౦ ౬ ౦ |
| భగవద్గీత భారతసావిత్రోపాఖ్యానంబ్రహ్మసూత్రం | ౦ ౮ ౦ |

ఇవిమొదలైన అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు సరసముగా విక్రయించబడును పోస్టుచార్జిప్రత్యేకము,

ఇట్లు

అల్లాడి - హయగ్రీవశాస్త్రి

రామానంద ముద్రాక్షరశాల

చాకలపేట పోస్టు.



శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర మహాభాగవతము.

## స ప్త మ స్కం ధ ము.

శ్రీమద్విఖ్యాతిలతా | క్రామితరోదోంతరాళకమనీయయశో | జీమూతతులితదేహా | శ్యామలరుచిజాలరామచంద్రనృపాలా॥

వ॥ మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాతవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రునవలోకించి ॥సీ॥ సర్వభూతములకు సముఁడై చెలిప్రియుండగు వైకుంఠుఁడనంతుఁ డాఢ్యు | డింద్రునకొఱకునై దైత్యేంద్రుల నేటికి విషమునికైవడి వైరికిచంపె | సురల జంపంగ నసురుల చేదనకయ్యెడి లాభమెంతైనగదె | నిర్వాణ ధుండ నిర్గుణుండగు నసురులవలని భయంబుపగయు గలుగనేరనట్టి ఘనుండు దైత్యులజంపి | సురలఁ గాచుచునికి చోద్యమనుచు | సంశయంబు రాకుజనియించె మునినాథ | ప్రజ్ఞ మెఱసి తెలియఁబలుకవయ్య | అనిన శుకుండిట్లనియె శా॥ నీసంప్రశ్నము వర్ణనీయము మగవా నికరంబు రాజేంద్ర | శ్రీశంభావ్యవినచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁద | ద్దాసాఖ్యానములోప్పవిష్ణుచరణాధ్యానప్రధానంబులై | శ్రీసంధానములయి మునీశ్వరవచోజేగియుసనంబుల్ ॥క॥ చిత్రంబు ముత్రైలోక్యప | విత్రంబులు భవలతాలవిత్రంబులున | క్షేత్రంబులు మునిజనవన | చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్ ॥వ॥ పరేంద్రా కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెదవినుము వ్యక్తుండుగాక గుణంబులు లేక ప్రకృతిం జెందక భవంబులనొందక పరమేశ్వరుండు తనమాయవలనైన గుణంబులనావేశించి బాధ్య బాధకత్వంబులనొందుచుండు గుణరహితుండు సత్వరజస్తమంబులు ప్రకృతిగుణంబు లా గుణంబులకు నొక్కొక్క కాలంబున హానివృద్ధులుగలవా యీశ్వరుండు సత్వంబున దేవఋషులను రజోగుణంబు నసురులను దమోగుణంబున యక్షరక్షోగణంబులను విభజించె సూర్యుండు పెక్కుడలం గానంబడియు నొక్కరుండైన తెఱంగు నవద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండుగాడు తత్త్వవిదులైన పెద్దలు తమలోనం బరమాత్మస్వరూపంబునను న్నయీశ్వరుని నివ్విధంబున నెఱుంగుదురు జీవాత్మకుబరుండైన సర్వమయుండు తనమాయచేత వి

శ్వంబుసృజియింపంగోరి రజంబునఁగ్రీడింపంగోరి సత్వంబున నిద్రింపఁగోరి త
మంబుసుత్పాదించిచరమైనకాలంబునసృజియించుచు నాకాలమునసర్వదర్శ
నుండైనయీశ్వరుఁడు కాలాహ్వయుండైన సత్వగుణంబైన దేవానీకంబునకు
వృద్ధియు రజస్తమోగుణులైన రాక్షసులకు హానియుం జేయుచుండు॥ క॥జన
నాయకయీయర్థము।ఘనయశుఁడగుధర్మజునకుఁ గ్రతుకాలమున।మును
నారదుండుసెప్పెను।వినుపించెద వినుముచెవులు విమలతనొందన్॥ వ॥ ను
న్నుధర్మరాజుసేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుఁడుహ
రి నిందించినిశితనిర్వక్రచక్ర ధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వ
చ్చిహరిదేహంబు సొచ్చుటంజూచి వెఱఁగుపడిధర్మజుండు సభలోనున్ననార
దునీక్షించి యిట్లనియె॥ గీ॥ఏట్టివారికైన నేకాంతులకునైన। వచ్చి చొరఁగ
రానివాసుదేవుతత్వమందుఁజేరిధరణీశుఁడహితుఁడై। యెట్లుచొచ్చెమునివరే
ణ్యనేడు॥ ఉ॥ వేఁడుమాధవుం దెగడివిప్రులుదిట్టిఁభగ్నుఁడైతమో। లీను
డుగాడెత్తొల్లి మదఘూర్ణితుచైద్యుఁడుపిన్నాటనుం। డేఁయుమాధవుస్వీవన
హించడుభక్తివహింపడట్టివా। డెనిట్లప్రభావముననీపరమేశ్వరునందుఁజొ
చ్చెనో॥ మ॥హరిసాధింతుహరిన్ గ్రహింతుహరిబ్రాణాంతంబు నొందింతుదా
హరికిన్ వైరినటంచువీఁకపటురోషాయత్తుడై యెప్పుడున్। దిరుగుం బ్రువ్వడు
నోరుబ్రీలిపడదో దేహంబుదాహంబుతో । నరకావాసమునొందఁడేక్రియజగ
న్నాథుం బ్రవేశించెనో॥వ॥అదియునుంగాకదంతవక్త్రుండునుఁవీడునునిరం
తరంబు గోవిందునిందసేయుదురు నిఖిలజనులుసందర్శింపనేఁడువీరికి విష్ణుసా
యుజ్యంబుగలుగుటకేమి హేతువువినిపింపుము పవనచలితదీపశిఖయుంబో
లెనాహృదయంబు చలించుచున్నదనినధర్మనందనునకు నారదుండిట్లనియె॥
దూషణభూషణతిరస్కారంబులునశరీరంబునకుంగాని పరమాత్మకులేవు శరీ
రాభిమానంబునంజేసిదండవాక్పారుష్యంబులు హింసయైతోఁచు తెఱఁగుననే
ను నాయదీయంబను వైషమ్యంబుభూతంబులకుశరీరంబునంద సంభవించునభి
మానంబుబంధంబునిరభిమానుండై వధించినవధంబుగాదుకర్తృత్వమెల్లవ
వానికిహింసయుసిద్ధింపదు సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైష
మ్యంబులేదుగావున ॥గీ॥అలుకనైన జెలిమినైనగామంబున। నైనబాంధవ
మ్మునైనభీతినైన దగిలితలపనఖిలాత్ముఁడగుహరి। జేరవచ్చు వేఱుసేయడత
డు॥క॥వైరానుబంధనంబున। జేసినచందమునవిష్ణుజిరతరభక్తిం। జేరగ
రాదనితోఁచును। నారాయణభక్తియుక్తినాచిత్తమునన్॥ క॥ కీటకముదెచ్చి

సంస్మరణంబున యోగవియోగంబులనొందించుచు సంభవవినాశశోకవివేకావివే
కచింతాస్మరణంబులువివిధంబులీయర్థంబు నకు బెద్దలు ప్రేతబంధుయమసంవా
దంబనునితిహాసంబునుదాహరింతురు వినుండు సెప్పెద నుశీనరదేశంబునందు సు
యజ్ఞుండను జగలండశేండు శత్రువులచేత యుద్ధంబున నిహతుండై యున్నయె
డ| సీ॥ చినిగినబహురత్నచిత్రవర్ణముతోడ రాలినభూషణరాజితోడ భిశరబా
ణనిర్భిన్నవక్షముతోడ| దలుచుగారెడుశోణితంబుతోడ|గీర్ణమైజారినకేశబం
ధముతోడ రయరోషదంష్ట్రాధరంబుతోడ| నిమిషహీనంబైన నేత్రయుగ్మము
తోడ భూరజోయుతముఖాంబుజముతోడ| దునిసిబడినదీర్ఘదోర్దండములతో
డ| జీవరహితుడగునుశీనరేంద్రు| జట్టిబంధుజనులుసారదినుండగ భయక్రాం
తలెల్ల॥ శా॥ ప్రస్తాకంపితకేసబంధములతో సంఛిన్నహారాళితో| హస్తాబ్జంబు
లుసాచిమోదికొనుచున్ హానాథయంచున్ బహు| ప్రస్తావోక్తులతోడ నేడ్చిరివ
గన్ బ్రాణేశుపాదంబుపై| నస్తోకస్తనకుంకుమారుణవికీర్ణాస్రంబువర్షించుచు
న్॥ మ॥ అవస్థ నిన్ను నుశీనరప్రజలకర్థానందసంధాలుగా|ముని నిర్మిం
చినబ్రహ్మనిర్దయతను చూలించె నేవీరికి| ద్ననయ్యశ్రేణికి మాకు దిక్కుగలదే ధా
త్రీశ నీబోటికిం| జనునే పాసిచనంగ భార్యతృపమలన్ స్నిశ్రులు బుత్రులన్॥
మ॥ జనలోకేశ్వర నిన్ను బాసిననిమేషంబున్ మహాబ్జంబులై| చనులోకాంతర
గామివై మఱలకీచందంబున న్నీవు వో| యిర నెబ్బ గిజా తు మెల్లముగ దాయిలో
లోకవృత్తంబునే| డపలజ్వాలల జొచ్చి వచ్చెదము నీయంఘ్రిద్వయంబు జూడగన్
వ॥ అని యిట్లు రాజభార్యలా రాజశవంబు డగ్గఱి విలపింప బ్రొద్దుగుంకె నీసమ
యంబున వారులవిలాపంబులవిని బాలకుండై యముండు సనుదెంచి ప్రేతబంధు
లం జూచి యిట్లనియె॥ ఉ॥ మచ్చికవీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహపుట్టు
చు| న్జచ్చుచు మండజూచెదరు చావునకొల్లడ గవచ్చునే యెచ్చట బుట్టినచ్చటికి
నేగుట నైజము ప్రాణకోటికిన్॥ క॥ జననీజనకుల బాసియు| ఘనవృకముల బాధప
డకగడు బిన్నలమే| మని యెడ మెవ్వడు గర్భం బునమును బోషించెవాడె పోషకు
డడవిన్॥ క॥ ఎవ్వడు సృజించు బ్రాణుల| నెవ్వడు రక్షించు ద్రుంచు నెవ్వడవంతుం
డెవ్వడు విభుడెవ్వడు వా| డివ్విధమ ననచు బెనుచు హెలారతుడై॥ గీ॥ ధనము వీ
ధిబడిన దైవవశంబున| నుండ బోవు మూలమున్నైన| నడవిరక్షలేనియబలుం
డు వర్ధిల్లు| రక్షితుడు నందిరమున జచ్చు॥ క॥ కలుగును మఱిలేకుండును| గలభూత
ములెల్లగాలకర్మవశములయి| నిలువండు ప్రకృతింతద్గుణకలితుడు గాడాత్మ
మయుండగమ్ముదుదలపన్॥ సీ॥ పాంచభౌతికమై సభవనంబు దేహంబుపురు

షుండు దీనిలో బాహ్యకముఁ। వశమున నొకవేళ వెలిఁగించు దీపించుఁ దఱిమెననొ
క వేళదలఁగిపోవు। జెడ నేని దేహంబు చెడుగాని పురుషుండు చెడఁడు తనికినింత జేటు
లేదు। పురుషునకు దేహపుంజంబునకు వేఱుగాని యేకత్వంబుగా నరాదు। దార
వుల వెలుఁగు దహనుని కైవడి। గాయము లజరించు కాలిభంగి। నాశిలిమైన నభ
ః చాటున వేఱు। దెలియవలయు దేహి దేహములకు॥ అని మఱియు నిట్లని యె
క్కి భూపాలకుఁడు ప్రవోమె డినొండేమి విలపింప నేటికి వెఱ్ఱులార। నెవ్వఁడు భా
షించు నెవ్వఁడాకర్ణించు నట్టివాఁడెన్నఁడో యరిగి రాడు ప్రాణభూతుండై వినవను
డాకర్ణింప భాషింప నెందు ప్రాణి దేవ। ములకు వేఱై తాను ముఖ్యుడై యింద్రి
యవంతుడై జీవుండు వలను మెఱయు। భూభవమున భూతపంచకేంద్రియమ
నో। లింగదేహము లనులీల గూడి। విడచు నన్యుఁడొకఁడు విభుఁడ దీనికి మీరు। పొగ
లనేల వగల నేరల నేల॥ క॥ ఏ దాక నాత్మ దేహము। నొందెడు నందాక కర్మ యో
గము లట్లైపై। జెందు పుమాయా యోగ। సందితులై రిత్రజాలి బడ నేమిటికిన్॥ మ॥
చెలుదంద్రు వదల్లు లాత్మజులు సంసేవ్యాల్పతుల్యాయు నిర్మలగేహంబు ఘట ~~ముదూ~~
తుఁ రుమహామాయాగుణభ్రాంతులై కలలో దోచిన యర్థముల్ నిజము లేక
మానుబిదపన్ గర్మాంతకాలంబునన్॥ వ॥ మఱియు మాయాగుణప్రపంచంబు
నెఱుంగడి తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబుల గూర్చి సుఖదుఃఖంబులం జెందరజ్ఞులగొం
దఱు యోగవియోగంబుల సుఖదుఃఖంబులనొందుదురు తొల్లి యొక మహా
గహనంబున విహంగంబుల కును తభూతుండైన యెఱుకగలడతండు ప్రభాతంబు
ననొక్కనాడు లేచి వాటంబైన వేటతమకంబున॥ క॥ వలలురులు జిగురుగండెలు
జలిదియు జిక్కంబు ధనువు శరముఁ గొని చుం। బులుగలబట్టెను వేడుక। నలుకు
డు వెడలంగ గదిలి యడవికి నడిచెన్॥ ఇట్లడవికి జనితత్ప్రదేశంబునందు॥ క॥ కట్టు
లుకదిదుక చాటున। బిట్ట మరిచో లంగిచి వసునఱెక। ల్పటివిరిచి చిక్కములో
బెట్టుచు విరిచెలోక భీకరలీలన్॥ వ॥ మయునానా విధంబుల గుళకుంతబు
నొందించుచు సకలపక్షిసంహారబద్ధకుండై దనముందట గాలచోదితుండై సంచరిం
చుచున్న కుళింగపక్షి మిథునంబుఁ గనుగొని యదుగుంగినుఱిం బిగిచి యొ
క్కచిక్కంబులోవైచినఁ జూచి దుఃఖించు కుళింగపక్షి ఇట్లనియె॥ చ॥ అడవుల మే
త మేసి మనుష్యుల కెన్నడు నెగ్గు జేయక యి। క్కడ విహరింప నెడకట కట్టడి బ్రహ్మకి
రాతు చేతిలో। బడుమని వ్రాసె నేను నడబాపవు దైవము కంటికంతనే। కుక్కడు
బరువయ్యనే బ్రతుకుకోమలి యేమని సేతు నెల్లరే॥ క॥ వకమాటు మనలనందఱ
ర। బ్రకటించి కిరాతు వలల బడ జేయకని। నొకటి వల్లబడ జేసె విక టీ త్రతడశ

హైనవిధి నేమందురా॥ ఉ॥ కాకులు రావు పిల్లలకు। తేపటి నుండియు మేతగానమిన్
బాకుచు గూటిలో నెగసి పోవగ నేరవు మున్న తల్లియో। దిక్కున నుండి వచ్చునన
న। త్రిప్పని చూపులన్ నిక్కి నిక్కి నల్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతు
నక్కటా॥ అని విప్రాలంభంబున॥ క॥ కుంఠిత నాదము తోడను। గంఠము శోషింప వగచు
ఖగము విహానన్నో। త్కంఠుండై న కిరాతుడ కంఠిరగతి నేసె నాక్రోలంధరగూ
లెఖగము ఘోషముతోడన్। గాలము డాసిన నేలగూలక పోవశమె యెట్టిగుణవం
తులకున్॥ ఉ॥ గావున మీరు చచ్చుతరి గానరు చచ్చెదరి త్రిబద్ధభా। త్రివిధ దేహముం
గ దిసి దీనత నేడువ నేల పొందుచి। తావతులార వత్సర శతంబునకైనని జేసు చక్కి
కిం। బొప్పుట దుర్లభంబు మృతి బొందిన వారలు సేరవత్తురే॥ వ॥ అని ఇట్లు కపట బా
లకుండైన క్రీడించుచున్న యముని యుపలాలనాలాపంబులు విని సుయజ్ఞుని బంధు
వులెల్ల వెరుగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకంబు మాని సుయ
జ్ఞుని సాంపరాయిక కృత్యంబులు సేసి చనిరంత నంతకుండంతర్హితుండయ్యె నని చె
ప్పి హిరణ్యకశిపుండు దనతల్లిని దమ్ముని భార్యలం జూచి యిట్లనియె॥ క॥ పరు లెవ్వ
రు దామెవ్వరు। పరికింపగ నేకమగుట భావింపరు త। త్పర మనజ్ఞానము లేమిని। బ
రులును మేమనుచు దోచు ప్రాణుల కెల్లన్॥ వ॥ అని తెలియం బలికిన హిరణ్యకశిపుని
వచనంబులు విని దితి కోడండ్రును దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలి
గి లోకనంబు గలిగి లోకాంతరగతుండై కొడుకునకు వగవక చనియెనని చెప్పి నా
రదుండు ధర్మనందనున కిట్లనియె॥ క॥ అజరామర భావంబును। త్రిజగద్రాజ్యంబు
న ప్రతిద్వంద్వము దో। ర్విజితాఖిల శాత్రవమును। గజరిపుబలమును హిరణ్యకశి
పుడు గోరెన్॥ వ॥ ఇట్లు గోరి మందరాచల ద్రోణికిం జని యందు గాలి పెను వ్రేల నేల
నిలువం బడి యూర్ధ్వబాహుండై మిన్ను జూచుచు వాడి మయూఖంబుల తోడి
ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభాజాలంబుల తోడ నెవ్వరికిం
దేరి జూడరాక పరమ దారుణంబైన తపంబు సేయుచుండె నిర్జరులు నిజస్థానంబున
నుండిరంత॥ మ॥ అదరెం గుంభిని సాద్రియై కలగె నేడంభోనిధుల్ తారక। ల్చెదరెన్ సం
గ్రహసంఘములై దిశలు విచ్చి వ్నాంతలై మండెదల్। లదరెం గుండెలు జంతుసంహ
తికి నుగ్రాజార దైత్యేంద్రమూ। ర్ధన్న దిశోద్ధూత సధూమ హేతిపటలోదంచత్త
పోవహ్నిచేన్॥ వ॥ ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజ తపోదహనవి
జృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడచి బ్రహ్మలోకంబునకుం జని లోకే
శ్వరుండైన బ్రహ్మకు వినతులై యిట్లని విన్నవించిరి॥ క॥ దితికొడుకు తపము వేడిమి।
నతితపులమై తిమింక్ర నలజడి నమరా। పతినుండ వెరతుము దివ్యేది। గతి మాకిట దేవ

దుర్లభములీయర్థంబులెవ్వారికి। నెన్నెన్నివారలుగోరరీవరములనొందించి
తీర్చెద। నన్నుంగోరినవెల్లనిచ్చితి ప్రవీణత్వంబుతోబుద్ధినం। పన్నత్వంబున
నుండుమీసుమతివైభద్రేకశీలుండవైవ॥ అనియిట్లుమోఘుంబులైనవరంబులి
చ్చిదితినందనుచేతంబూజితుండైయరవిందసంభవుండుబృందారకసందోహ
వంద్యమానుండగుచునిజమందిరంబునకుంజనియెనిట్లుధనంబునిలింపారాతివర
పరంపరలుసంపాదించుకొని॥క॥సోదరుజంపినపగకై।యాదరమించుకయులేక
యసురేంద్రుండుక।జోదరుపైవైరముదు।ర్వారరతుండగుచుజేసెమనుజా
ధీశా॥ సీ॥ఒకనాడుగంధర్వయూథంబుపరిమార్చు దివిజులనొకనాడుదెరలదో
లు।భుజగులనొకనాడుభోగంబులకుబావుగ్రహములనొకనాడుగట్టివేచు। నొ
కనాడుయక్షులనుగ్రతదండించునొకనాడువిహగులనొడిసిపట్టు। నొకనాడుసి
ద్ధులనోడించిబంధించుమనుజులనొకనాడుమర్దించు।గడిమినొకనాడకిన్నర
ఖచరసాధ్య।చారణప్రేతభూతపిశాచవన్య।సత్త్వవిగద్యాధరాదులసంహరించు
దితిసుతాహ్వండుదుస్సహతేజుడగుచు॥ క॥అట్లల్లతోడగోట్టల।కట్టనుకం[illegible]
ద్రోచిక్రవ్యాదులతో।జుట్టువిడిసిదిక్పాలుర।ట్టణములుగొనియొనతకుబలమున
నధిపా॥క॥కృశులైసంప్రాపితదు।ర్దశులైసర్వంకభోగ్యదైతేయాజ్ఞా।పశులైనిశలు
నుదివములు।దిశలెల్లనుగట్టువడియెదితిజనఘా॥ వ॥మఱియునద్దానవేంద్రుం
డువిద్రుమసోపానంబులును మరకతమణిమయప్రదేశంబులును వైడూర్యర
త్నస్తంభసముదయంబులును- చంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులు
నుపద్మరాగపీఠకనకవాటగేహళివిటంకవాతాయనంబులును-విలంబమానము
క్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును- వివిధవిచిత్రవిమానంబులు
ను నిరంతరసురభికుసుమఫలభరితపాదపహృద్యోద్యానంబులును- హేమారవిం
దసౌగంధికబంధురసరోవరంబులును-రమణీయరత్నప్రాసాదవిశేషంబులును
మనోహరపరిమళశీతలమందమారుతంబులును- మృదుమధురనినదకీరకోకిల
కులకోలాహలంబులునుగలిగి విశ్వకర్మనిర్మితంబైత్రైలోక్యరాజ్యలక్ష్మీశో
భితంబైన మహేంద్రభవనంబుజొచ్చి॥మ॥ దితిపుత్రుండుజగత్త్రయైకవిభుడై
దేవేంద్రసింహాసనో। ద్ధతుడైయుండహరాచ్యుతాంబుజభవుల్దప్పంగళితస్వ
యం।గతులైతక్కినయక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదులానతులైకానికలిచ్చి
కొలురతనిన్నానాప్రకారంబులన్॥ శా॥ యేదిక్పాలురజూచినేడలుగునో యే
దేవుబంధించునో। యేదిగ్భాగముమీఱదాడిచనునోయేపౌరులంజంపునో।
యీదయితేశ్వరుడంచునొండొరులుదారింద్రిదులాస్థానభూ। వేదిన్నిల్ల

డంబోత్తరుఁడు నతఁడు వీడ్రుల క్రియ నన్యనాథమిబోటన। భగవద్భక్తులు దైత్యరాజ
తనయుం బోటిం జకీర్తింపరే॥ క॥ గుణనిధియగు ప్రహ్లాదుని। గుణములనేకము
లుగలవు గురుకాలమునన్। గణుతింపనశక్యంబులు। ఫణిపతికిన్ బృహస్పతికిని భా
షాపతికిన్॥ వ॥ ఇట్లు సద్గుణగరిష్ఠుండైన ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదే
వుఁయందు సహజ వర్ధమాననిరంతర ధ్యానరతుండై॥ సీ॥ శ్రీవల్లభుండుద
న్నుఁ జేరిన యట్లైన జెలికాండ్రి నెవ్వరిఁ జేర మఱచు। సురారి తన మ్రోల నాడిన
ట్లైన ననురక్త బాలురతోడ నాడ మఱచు। భక్తవత్సలుఁ డనుసంభాషించిన ట్లైన నపర
భాషణముల మాట మఱచు। సురవంద్యుఁ దన లోనఁ జూచిన యట్లైన నలోకి
త వస్తుంబు జూడ మఱచు। హరిపదాంభోజయుగ చింతనామృతమున। నంతరం
గంబు నిండిన ట్లైన నతఁడు। నిత్యపరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి। జడత లే
కయయుండును జడునిభంగి॥ శా॥ పానీయంబులు ద్రావుచుం గుడుచుచు న్భా
షించుచు న్హాసలీ। లా నిద్రాదులు సేయుచుం దిరుగుచు న్లక్షించుచు న్సంతత। శ్రీ
నారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాదనం। ధానుండై మఱచు న్సురా
రిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా॥ సీ॥ వైకుంఠచింతావిచర్జిత చేష్టుఁడై యొకచో
టు నేడుచు నొక్కచోట। నశ్రాంత హరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పా
డు నొకచోట। విష్ణుఁడింతియ కాని వేఱొండు లేద యెత్తి లినగుచు నొకచో
ట। నలినాక్షుఁ డను నిధానము గంటి నేనని యుబ్బి గంతులు వైచు నొక్కచోట
బలుకు నొక్కచోట బరమేశ గేధివు। బ్రణయహర్షజనిత భాష్పసలిల। మిళితపు
లకుఁడై నిమీలిత నేత్రుఁడై। యొక్కచోట నగుచు నూరకుండు॥ వ॥ ఇట్లు పూర్వజ
న్మపరమభాగవత సంసర్గసమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకం
బున నఖర్వనిర్వాణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమి
త్తంబునం దన చిత్తంబ న్యాయత్తంబు గాక నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుం
డు నసంసార నివృత్తుండును బుధజన విధేయుండును మహాభాగధేయుండును సు
గుణమణిగణ గరిష్ఠుండును పరమభాగవత శ్రేష్ఠుండును గర్మబంధలతాలవి
త్రుండును బవిత్రుండైన పుత్రుని యందు విరోధించి సురవిరోధి యను కంపలేక
చంపం బంపెనని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె॥ శా॥ పుత్రుల్ నేరక
న్న జనకు లోపేక్షింతు రెల్లప్పుడు। న్మిత్రత్వంబున బుద్ధిఁ జెప్పి దురితోన్మేషంబు వా
రింతురే। శత్రుత్వం బుంపలం బరిట్టి యడనా సౌజన్య రత్నాకరుని। బుత్రున్బోకప
విత్రుఁ డం డ్రిమిగుల వ్యాధింప నెట్లోర్చెనే॥ ఉ॥ బాలుఁ బ్రభావిశాలు హరిపాదప
యోరుహచింతనప్రియా। లోలు గృపాళు సాధుగుణలాకపదాసత భాలు సమ్మ

లశ్రీలుసమస్తసభ్యనుతశీలువిఖండితమోహవల్లికా।జాలునదేలతండ్రివదజం
పగబంపుమునీంద్రసెప్పవే॥ అనినారదుండిట్లనియె॥ శా॥ లభ్యంబైనసురాధిరా
జపదముంలక్షింపఁదశ్రాంతమా।న్సభ్యత్వంబునమన్నవాఁడబాలుఁడై జాడ్యంబు
తోపిడువి। ద్యాభ్యాసంబునఁగానితీవ్రమతిగాఁడంచున్విచారించిదై జాడ్యంబు
డొక్కఁడిదంబునంబ్రియసుతుస్వీక్షించిసోత్కంఠుఁడయి॥ క॥ చదువనివాఁడజ్ఞుం
డగు। జదివినసదసద్వివేకచతురతకలుగుం। జదువఁగవలయునుజనులకు। జ
దివించెదనార్యులొద్దజనువుముతండ్రీ॥ వ॥ అనిపలికియసురలోకపురోహితుం
డగుశుక్రాచార్యుకొడుకులబ్రిచండామర్కులరావించి సత్కరించిఇట్లనియె॥
శా॥ అంధపక్షియనున్నవాఁడుపలుకండస్మత్ప్రతాపక్రియా।గ్రంథంబించుక
లేదుమీరుగురుపుత్రకారుణ్యచిత్తుల్మనో। బంధుల్మాన్యులుమాకుపెద్దలు మ
హుంబాటించిఈబాలకున్।గ్రంథంబుల్పదివించినీతికుశలుంగాఁజేసిరక్షింపరే॥
వ॥ అనిపలికివారలకుంబ్రహ్లాదునప్పగించితోడ్కొనిపొండనినవారునుదనుజరా
జకుమారునింగొనిపోయి యతనికిసవయస్కులగుసహస్రోత్తమైనయసురకుమా
రులంగొందరంగూర్చి॥ ఉ॥ అచ్చితభక్తితోడఁదనుజాధిపగేహసమీపమందుబ్ర
వేశించిసురారిరాజసుతుఁజేకొనిశుక్రకుమారకుల్పఠి। పించిరిపాఠయోగ్యము
లుపెక్కులుశాస్త్రములాకుమారుఁడా। లించిపఠించెసన్నయుఁజలింపనివైష్ణవ
భక్తిపూర్ణుఁడై॥ క॥ ఏపగిదివారుసెప్పిరినాపగిదింజెప్పఁగా-ఇట్టనియా।షేపిం
పడుతానన్నియు।రూపించినమిథ్యలనినిరూఢమనీషన్॥ శా॥ అంతంగొన్నిదినం
బులేగినసురేంద్రారాతిశంకాన్వితా।స్వాంతుండైనిజనందనుంగురువులెజాడం
బఠింపించిరో।భ్రాంతుండేమిపఠించెనోపిలిచిసంభాషించివిద్యాపరి।శ్రాంతిం
జూచెదగాకనేఁడనిమహాసౌధాంతరాసీనుఁడై॥ ఉ॥ మోదముతోడదైత్యకుల
ముఖ్యుఁడురమ్మనిచీరబంచెబ్ర। హ్లాదకుమారకున్భవమహార్ణవతారకుఁగామరో
షలోభవిరోధిషడ్వర్గపరిహారకుఁగేశవచింతనామృతా। స్వాదకఠోరకుంగలు
షజాలమహోగ్రవనీధారకున్॥ వ॥ ఇట్లుచారులచేతనాహూయమానుం
డై ప్రహ్లాదుండుచనుదెంచిన॥ శా॥ ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమేయుద్యో
మారూఢసం।విత్సంపన్నుడవైతివేచదివితేవేదంబులున్శాస్త్రముల్। వ్యాత్సర
మ్మఁజేరఁజేతికోడుకువాత్సల్యసంపూర్ణుఁడై। యుత్సంగాగ్రముఁజేర్చిదానవవి
భుండుతరంతదీపింపఁగన్॥ క॥ అనుదినసంతోషణములు। జనితశ్రమతాపదుః
ఖసంశోషణముల్। తనయులసంభాషణములు। జనకులకుంగర్ణయుగళసద్భూష
ణముల్॥ వ॥ అనిమరియుఁబుత్రానీకెవ్వదిభద్రంబైయున్నది చెప్పుమనిపెంగ

యుఁజెప్ప నేర్చెఁ దగ దా గ్రంథార్థముల్దెలుపై। యన్నా యెన్నఁడు నీవు నీతి మాతి
వాదం బున్న మహావాంఛతో। నున్నాఁడ వన్న నుగన్న తండ్రి భవదీయోత్కృష్టతజ్ఞావ
నే॥ వ॥ అనిన గన్న తండ్రికిఁ బ్రియనందనుండైన ప్రహ్లాదుం డిట్లనియె॥ క॥ చదివిం
చిరి నను గురువులు। సదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నే। జదివినవి గలవు పె
క్కులు। చదువులలో మర్మ మెల్ల జదివితి తండ్రీ॥ మ॥ తనుహృద్భాషల సఖ్యము
శ్రవణముం దాసత్వముం వందనా। ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సం
కీర్తనల్ చింతనం। బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరి నమ్మి స। జ్జ
నుఁడై యుండుట భద్రమంచుఁ దలంతున్ సత్యంబు దైత్యోత్తమా॥ శా॥ అంధేందూ
దయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస।ద్గ్రంథవ్యాఖ్యానముల్ నపుంసకవ
ధూకాంక్షల్ కృతఘ్నావలీ। బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యము
ల్ క్రోడస।ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్॥ సీ॥ కమలా
క్షునర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ। సురరక్షకుని
జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము। విష్ణు నా
కర్ణించు వీనులు వీనులు మధువైరి దవిలిన మనము మనము। భగవంతు వలగొను
పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి। దేవదేవుని జింతించు దినము
దినము। చక్రహస్తుఁ బ్రకటించు చదువు చదువు। కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁ
డు। తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి॥ సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కా
య మే పవనకుంభిత చర్మభస్త్రి గాక। వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వని తోడి ఢక్క గాక। హరిపూజనము లేని హస్తంబు హస్తమే తరుశా
ఖనిర్మిత దర్వి గాక। కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రము
లు గాక। చక్రిచింత లేని జన్మంబు జన్మమే। తరళసలిల బుద్బుదంబు గాక। విష్ణుభక్తి
లేని విబుధుండు విబుధుఁడే। పాదయుగము తోడి పశువు గాక॥ సీ॥ సంసార జీమూ
త సంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక। తాపత్రయాభీల దావాగ్ని
లారు సమయునే నారాయణామృతవృష్టి లేక। సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే హరిపదనీ
రజ బాడబాగ్ని లేక। ఘన విపదంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభ
లు లేక। నిరుపమాపునరావృత్తి నిష్కళంక। ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక। తామరసగర్భునకు నైన దానవేంద్ర॥ వ॥
అని యివ్విధంబున వెరపు మఱపు నెఱుంగక తనువులకుఁ జెడిపలికెడి కొడుకును నుడువులు నె
వులను విని కులయమునోదవిన కటములదర బెదవులుగఁ జుచ్చుచు నదరిపడి గురునుతు
ని గనుంగొని నిముతకథనంబు గరపినాఁడవని దానవేశ్వరుం డిట్లనియె॥ చ॥ వ

ఋతర నీతిశాస్త్రచయ వారగుఁ జేసెదనంచు బాలునిన్। వటుగోసిపోయి వానికినన
త్ర్వాముల్లైనవిరోధిశాస్త్రము। లుక్కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు
నమ్మితిం। గటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థవు బ్రాహ్మణుండవే॥ క॥ ధర్మే
తరవర్తనులును। దుర్మంత్రులునైనజనులదుఃఖములొందు। న్మర్మములు కల
చికల్మష। కర్ములరోగములునొందుకైవడివిప్రా। అని రాజునకుం బురోహితుం
డిట్లనియె॥ ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథ విరోధశాస్త్రము। ల్సెప్ప
క్రూరులైనరులు సెప్పరు మీచరణంబులానను। మ్మొప్పుడు నీకుమా[illegible]నింత
యునైనమానీవ యొవ్వారుం। జెప్పెడి వాటిగాదు ప్రతిచి తదలంపు మునేర్పునన్వా
డిఁక॥ క॥ పుత్రులము పురోహితులము। పాత్రులమే మదియుగాక భార్గవుఁ ముని
పుత్రుని నిటువలెఁ జేయద। శత్రులమే దైత్యజలధిచంద్రమ వింటే॥ వ॥ అనినగు
రునందనుం గోపి పక దైత్యవల్లభుండు కొడుకునవలోకించి ఇట్లనియె॥ క॥ వా
జ్జలు సెప్పనియీమతి। మజ్జాతుడవైన నీకు మఱి యొవ్వానిచే। నుజ్జాతమయ్యె బాల
క। తజ్జనులం జేరు గొను మతగనా మ్రోల్లక్॥ వ॥ అనిన దండ్రికి బ్రహ్లాదుం డిట్లని
యె॥ ఉ॥ అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రమత్తులై। చచ్చుచు బుట్టు
చున్న యలజర్విత చర్వణులైనవారికిం। జెచ్చెర బుట్టునే పరులు సెప్పిన నైన నిజేచ్ఛ
నైననే। మెచ్చిననైన గానలకు నేగిననైన హరిప్రబోధముల్॥ ఉ॥ కానని వాని
నూతగొని కానని వాడుః విశిష్టవస్తువుల్। గానని భంగి గర్మములు గైకొని కొందరు
కర్మబద్ధు। కానరు విష్ణుబాందరటగంతరకి. చన వైష్ణవాంఘ్రిసం। స్థానరజో
భిషిక్తులగుసంహ్యాత కర్మ ఋదానవేశ్వరా॥ శా॥ శోధింపంబడెనర్వశాస్త్రము
లురక్షోనాథ వెయ్యేటికి। న్నాథల్మాధవ శేముషీతరణసాంగత్యంబు నంగాకదు।
ర్మేధం దాటగవచ్చునే మవవధూ మీనోగ్రవాఛామక క్రోధోల్లోల విశాలసం
సృతిమహా ఘోరామితాంభోనిధిన్॥ వ॥ అనిపలికిన కొడుకును దిక్కరించి మ
త్కృతసేయక రక్కసుల రేడు దనతొడలపైనుండనీక గొబ్బునదిగ ద్రొబ్బి నిబ్బ
రంబగు కోపంబు దీపింప వేడిచూపుల మింటమంట లెగయ మంత్రులం జూచి ఇట్ల
నియె॥ శా॥ క్రోడంబై పినతండ్రిఁ జంపెననితా గ్రోధించిచిత్తంబులో। వీడం జే
యఁడు బంటు భంగి హరికిన్ ద్వేషికిన్ భృత్యుఁడై। వాడం గాకుటపా[illegible]ణవాయువు
లు వీడొప్పించుచున్నాడునా। తోడనైరము పట్టెనిట్టి జనక ద్రోహిన్ మహిం
గంటిరే। అనిరాక్షసవీరులవీక్షించియిట్లనియె॥

హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వధాదినివిధోపాయంబుల శిక్షించుట,

శా॥ పంచాబ్దంబుల వాఁడుతండ్రినగునా పక్షంబునిందించెయు। త్యజించిద్వే

తృణాతు లేశ్వరకుజంబాల వృత్త్యనమాతంగజాతులకును నాయాకులాగతం
బులయిన వృత్తులచౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు మానవుల
కు ప్రతియుగంబునయిన నిసర్గకంబులయిన ధర్మంబులు రెండులోకంబులం
దుసుఖకరంబులని వేదవిదులయిన పెద్దలు సెప్పుదురు కారుకారున దున్నెడు
క్షేత్రంబు లావుచెడునందు జల్లినబీజంబులు నిస్తేజంబులయియుండి లెస్సగ
నంకురింపవు నిరంతరఘృత ధారావర్షణంబున దహనంబునకు దాహకత్వం
బులేక శాంతింజెందునందు ప్రేల్చినహవ్యంబులుఫలింపవు తద్విధంబుననన
వరత కామానుసంధానంబునగా మోపముఖంబయినచిత్తంబు కామంబుల
దనిసి నిష్కామంబయి విరక్తినొందుగావున సత్వస్వభావంబుతోడ నెవ్వడు
దప్పక నిజవంశానుగతవిహితధర్మంబున వర్తించునరుండు మెల్లనస్వాభా
వికకర్మపరత్వంబు విడిచి ముక్తినొందుజాతిమాత్రంబున బ్రాహ్మణవర్ణం
బు నిర్దేశింపలేదు శమదమాదివర్ణలక్షణవ్యవహారంబుల గనవలయునని
నారదుండిట్లనియె॥ క॥ క్రమమున వర్ణంబులచిహ్నములెల్లను జెప్పబడి
యెనాశ్రమముల। ధర్మము లెఱిగించెదనన్నియు। సమదాహితక్రూరదయా
శాలనమకశీలా॥ వ॥ వినుము బ్రహ్మచారి మౌంజీకౌపీనయజ్ఞోపవీతకృష్ణా
జినపాలాశదండకమండలుధరుండును సంస్కారహీన శిరోరుహుండును ద
ర్భహస్తుండును శుచిప్రశస్తుండును మౌనియునయి త్రిసంధ్యంబుల బ్రహ్మగాయ
త్రిజపియించుచు సాయంప్రాతరవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనం
బులుసేయుచు గురుమందిరంబునకుంజని దానునిచ్చందంబున భక్తివినయసౌ
మనస్యంబులుగలిగి వేదంబులుసదువుచు నధ్యయనోపక్రమావసానంబుల
గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపువిహితగృహంబుల భిక్షిం
చి భైక్షంబుగురువునకు నివేదించియనుజ్ఞగొనిమిత భోజనంబుగావించుచు వి
హితకాలంబున నుపసించుచు నంగనయందు నంగనాసక్తులందుం బ్రయోజ
నమాత్ర భాషణంబులొనర్చుచు గురుపరాంగనలవలన నభ్యంగన కేశప్ర
సాధన శరీరమర్దనమజ్జనరహస్య యోగంబులువర్జించుచు గృహంబున
నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు॥ గీ॥ పొ
లతిదావవహ్నిపురుషు డాజ్యఘటంబు। గాగకూడరాదు గదిసినే। బ్రహ్మయై
యునగూతు బట్టకమానడు। వటువు సకింతిపొత్తు వలదు వలదు॥ వ॥ వినుము స్వ
రూప సాక్షాత్కారంబున దేహబహిరింద్రియాదికంబయిన యంతయునా
భాస మాత్రంబుగా నిశ్చయించి యొందాక జీవుండు స్వతంత్రుండయి నయినా

వ. తితోడను పస్థంబును మృత్యువునందు విసర్గంబుతోడ వాయువును దిక్కు
లందు శబ్దంబుతోడ శ్రోత్రంబును వాయువునందు స్పర్శంబుతోడ ద్వక్కును
సూర్యునియందు రూపంబుతోడ జక్షువ్వులును సలిలంబు లందుఁ బ్రచేతస్స
హితయయిన జిహ్వయు క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును
జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును కవియయిన బ్రహ్మయం
దు బోధంబుతోడ బుద్ధియు రుద్రునియం దహంకారంబుతోడ మమ
త్వంబును క్షేత్రజ్ఞునియందు సత్వంబుతోడ జిత్తంబును జొదించి యట
మీఁద బృధివి నుందు బృధివిని జలంబునందు జలంబును తేజంబునందు తేజంబు
ను వాయువందు వాయువును గగనమందు గగనము నహంకారతత్వమందున
హంకారమును మహత్తత్వమునందు మహత్తత్వమును బ్రకృతియం దు
బ్రకృతి నక్షరుండయిన పరమాత్మయందును లయంబునొందించి చిన్మాత్రా
వశేషితుండయిన క్షేత్రజ్ఞుండగు తన్ను నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుం
డఖండకాష్ఠుండునవహ్నిచందంబున బరమాత్మయైన నిర్వికారపరబ్రహ్మం
బునందు లీనుండగావలయు॥ క॥ అనఘువనప్రస్థుండయి చతుర్థమంబ లిట్లును
లుపుమమతియు। న్మనె నేని సన్న్యసింపం। జనునట మీఁదట నుముక్తిసంగత్వము
నకు ॥ వ॥ ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావసి
ష్టుండును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముం
డును సకలభూతసముండును శాంతుండును సమచిత్తుండును నారాయణప
రాయణుండునై కౌపీనంబును నాచ్ఛాదనమాత్రంబైన వస్త్రంబు ధరియించి
దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులగాన శాస్త్రంబులు వి
చారించి గ్రహనక్షత్రాది విద్యలజీవింపక భేదవాదంబైన తర్కంబులుతరిం
పక నెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వచించి యుపన్యసింపక బ
హువిద్యలజీవింపక మత్తాది వ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబు లొ
క్కచో డవసియింపక యూరనూర నొక్కొక్క రాత్రి నిలుచుచు గార్యకారణ
వ్యతిరిక్తంబై పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు సదసన్మయంబైన విశ్వం
బునందు పరబ్రహ్మంబైన యాత్మ నవలోకించుచు జాగరణస్వప్నసంధిసమయం
బులనాత్మనిరీక్షణంబు సేయుచు నాత్మకుబంధమోక్షంబులు మాయామాత్రం
బులు గాని వస్తుప్రకారంబున లేవని యును దేహంబునకు జీవితంబు ధ్రువంబు
గాదనియును మృత్యువు ధ్రువంబని యెఱుంగుచు భూత దేహంబుల సంభవనా
శంబులకు మూలంబయిన కాలంబు బ్రతీక్షించుచు నిర్విధము సజ్ఞానోత్పత్తి

బని పలుకుదురు దేవఋషులును బ్రహ్మపుత్రులగు సనసనకాదులునుండ భవ
దీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుండయ్యె ననేకజంతుసం
ఘాతసంకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబుత
న్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజనసంతర్పణంబని యెఱుంగు
ము. ఋషినరతిర్యగ్జమరశరీరంబులు పురంబులు వానియందు దారతమ్యంబు
లతోడ జీవరూపంబున భగవంతుడైన హరి వర్తించుటం జేసి పురుషుండన బ్ర
సిద్ధుండయ్యె నందు తిర్యగ్జంతులకంటె నధికత్వంబు నంబురుషునియందు విలసి
ల్లుటం జేసి పురుషుండు పాత్రంబు పురుషులలోన హరితనువైన వేదంబు ధ
రించుచుటంతోడ విద్యాతపోగరిష్ఠుడైన బ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మ
ణులలోన నాత్మజ్ఞానపరిపూర్ణుండైన యోగి ముఖ్యపాత్రంబని పలుకుదు
పరస్పరపాత్రంబులకు సహింపని మనుష్యులకు పూజనార్థంబు త్రేతాయు
గంబునందు హరిప్రతిమలు గల్పింపబడియెఁ గొందఱు ప్రతిమార్చనంబు
జేయుదురు పురుషశ్రేష్ఠులయిన వారలకునట్టి ప్రతిమార్చనంబు ముఖ్యా
ర్థప్రదంబు గాదు మంత్రాధికారులకు ప్రతిమార్చనంబు పురుషార్థప్రదం
బగు. ॥ గీ॥ అఖిలలోకములకు హరి దైవతము సూడ । హరికి దైవతము ధరాధి
నాథ। పదపరాగలేశపంక్తిచే త్రైలోక్య। పావనంబు జేయు బ్రాహ్మణుండు॥ వ
అట్టి బ్రాహ్మణజనులందు గర్మనిష్ఠులు తపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయో
గనిష్ఠులునై కొందఱు వర్తింతురందు జ్ఞాననిష్ఠునికిసన తఫలకామినియైన గృహ
స్థుడు పిత్రుజనులనుద్దేశించి కవ్యంబులును దేవతలనుద్దేశించి హవ్యంబులును బె
ట్టుటముఖ్యంబు దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైన పితృకార్యంబుని
కు మువ్వురినైన నొకరినైన భోజనంబు సేయింపవలయు ధనవంతుడైన శ్రాద్ధవి
స్తారంబుగ గర్తవ్యంబు గాదు దేశకాలప్రాప్తకందమూలఫలాదికంబైన
హరినైవేద్యంబున విధిచోదితప్రకారంబ గా శ్రద్ధతోడం బాత్రంబునందు బె
ట్టిన యన్నంబు కామదంబయి యక్షయఫలకారియగు ధర్మతత్త్వవేదియైన వాడు
శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు జేయక భక్షింపక చరింపవలయుఁ గందమూ
లాది దానంబున నసౌఖ్యాదిఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహిం
స జేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిదులైన ప్రోడలు
నిష్కాములై బాహ్యకర్మంబులు విడచి యాత్మజ్ఞానదీపంబులందు గర్మ
మయంబులైన యజ్ఞంబుల నాచరింతురు ॥ క ॥ పశువుల బొరిగొని మఖ
ములు । విశదముగ జేయు బుధుల వీక్షించి తమ । న్విశసనము జేయు

నోయెసి। తనిమసిశెగడొందుభూత గణమున శేంద్రా ॥ వ ॥ అదిగావున
ధర్మవేదియైన వాడుదైన ప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత
నిత్యనైమిత్తిక క్రియలజేయవలయు నిజధర్మబాధకంబైన ధర్మంబును బరధర్మ
ప్రేరితంబైన ధర్మంబు నాభాసధర్మంబును బాషండధర్మంబు కపటధర్మం
బును ధర్మజ్ఞుండైనవాడు మానవలయు నైసర్గికధర్మంబు దురితశాంతిసమ
ర్థంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర జేయుచు నైన ధనంబుగోర వలదు జీ
వనోపాయంబునకై నిట్టట్టుదిరుగక గార్హ్యంబు లేక జీవించుచు మహాస
ర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండయియుండియు. గోరక బ్ర
తికెడి సుగుణునికుఁగల సుఖంబు కామలోభంబు లందశదిశలం బరిధావనం
బు జేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదుల
వలన భయంబు లేక మెలంగు తెఱంగి కామంబుల వలననివృత్తి గలవానికినె
ల్లకాలంబును భద్రంబగును జిహ్వాదయిన్యంబునకును బుభుక్షుండు గృహపా
లకశునకంబుకియివడి సంచరించుచు సంతుష్టిలేక చెడు నసంతోషిగాని విప్రునికి
విద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబులగు నింద్రియలౌల్యంబున విజ్ఞా
నంబు నశించు సకలభూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబు జేసి
యుబుభుక్షువు పాసలవాలన గామపారంబును హింసవలన గామవారంబు
ను హింసవలన క్రోధపారంబును జేరటదుర్లభంబు సంకల్పవర్జనంబున
గామంబును గామవర్జనంబున క్రోధంబును నర్థానర్థదర్శనంబున లో
భంబును ద్వయితానుసంధానంబున భయంబు నాత్మానాత్మవివేకంబుల శోక
మోహంబులును సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరా
యంబును శరీరవాంఛ లేమిహింస యును హితాచరణంబున భూతజయంబైన
దుఃఖంబును సమాధిబలంబున దయివికవ్యథయును ప్రాణాయామాదికంబుల
నాత్మవ్యధయును సాత్త్వికాహంకారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమం
బులును గురుభజనకుశలుండయి శీలంబున జయింపవలయు॥ క॥ హరిమహిమత
లకు జెప్పెడి। గురువున్నరుడను చుదలచి కుంతిత భక్తికి। దిరుగు పురుషు శ్రమము
మెల్లను। గరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా॥ ఉ॥ యావనజాత నేత్రుఁ డంబర మే
శుమహాత్మ ప్రధాన పూరుషుఁ। దేవశరణ్యు సజ్జన ధ్యేయుఁ డనంతుఁ బరాణ యో
గిసంసేవిత పాదపద్ముఁ డమచిత్తము లన్నరుడంచు లోకులి। చ్ఛాదవిభూతి చుం
దుదురు సన్మతి లేకన రేంద్రమా॥ వ॥ వినుము పడింద్రియంబుల [illegible]
యంపుదత్పురులయిచ్ఛాపూరణ విధానంబుల జరితార్థులమైతిమను వార

విషయ శత్రుమధ్యంబునం గూల్చిన॥ గీ॥ విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా।
రధిసమేతు డైన రథికు బట్టి। యుగ్రగతి రమ్యత్యాయు తము గుసంచా। కూపమ
ధ్యమందు గూల్తురధిప॥
వ॥ విను వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును రెండు తెఱంగులయ్యె
నందుఁ బ్రవృత్తంబున రావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ బ్ర
వృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండుమార్గంబులు గలవందు హిం
సాద్రవ్యమయకామ్యరూపంబులైన దర్శపూర్ణమాసపశుయాగవైశ్వదేవ
బలిహరణప్రముఖంబులయిన యాగాదికంబు లిష్టంబులు దేవాలయవనకూ
పతటాకప్రముఖంబులు పూర్తంబులు ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దే
హాంతరారంభంబున దేహాద్యయాగ్రంబున వెలుంగువానితోడ నింద్రి
యంబులం గూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమరాత్రిక్షీణాయనకృష్ణపక్ష
రాత్రిదర్శనంబులవలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుం
డయి వృష్టిద్వారంబున గ్రమంబున నోషధిలతాన్నశుక్లరూపంబుల బ్రాపించి
భూమియందు జన్మించు నది పునర్భవరూపంబయిన పితృమార్గంబు నివృత్త
కర్మనిష్ఠుండైనవాడు జ్ఞానదీపంబులైన యింద్రియంబులందు గ్రియాయజ్ఞం
బుల యోజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పరూపంబయిన మనం
బునందు వికారయుక్తంబయిన మనంబును శాస్త్రయందు విద్యాదిలక్షణయై
న వాక్కు నవర్ణసముదాయంబునందును వర్ణసముదాయంబున కారాదే
స్వరత్రయాత్మకంబయిన యోంకారంబునందు నోంకారంబును బిందువందు
బిందువును నాదంబునందు నాదంబును బ్రాణంబునందు బ్రాణంబు బ్రహ్మ
మందు నిలుపవలయు దేవమార్గంబులయిన యుత్తరాయణశుక్లపక్ష దినా
ప్రాహ్నపూర్ణిమారాకలవలన సూర్యబ్రహ్మలోకంబులందుం జేరి భోగావ
సానంబున స్థూలోపాధి విశ్వుండై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధి
స్థుండై తైజసుండయి సూక్ష్మంబును గారణంబునందు లయింపఁజేయుచు కారణంబును
సాక్షిస్వరూపంబునందు లయించి తుర్యుండై సాక్షిలంబునందు శుద్ధాత్మం
డైయిద్విధంబుల ముక్తుండగుచు॥ గీ॥ అమరనిర్మితంబులై యొప్పి పిత్ర దేవ।

శరణులెవ్వరెఱుంగు శాస్త్రదృష్టి । నట్టివాఁడు దేహియై మోహమునఁ బొంద ।
డతిశయించు బద్ధుఁ డవనినాథ। వ॥ వినుము దేహములకుఁ గారణత్వంబున సంత్యా
మందును గలుగుచు బహిరంగంబగు భోగ్యంబును నంతరంగంబగు భోక్తయు
పతంబున బరంబగు జ్ఞానంబును జ్ఞేయంబును వచనంబున వాచ్యమును ప్రకాశ
ముసు బ్రకాశంబు నైన వస్తువునకు వేఱొండు లేదు ప్రతిబింబాదికంబు నవస్తు
త్వంబునం జేసి వికల్పిత బైతాంపంబు భంగి నైంద్రియకంబైన సర్వంబును
వస్తుత్వంబున వికల్పితంబై తోఁచుఁ గాని యథార్థంబు గాదు దేహాదికంబులు వి
నాశ్యంబులు వానికి హేతువులైన క్షితిప్రముఖంబులు వినాశ్యంబు లగుటం జి
ద్రూపుఁడు పరమాత్ముఁడు నవిద్యచేత నెంతయు పవికల్పంబు దోఁచు నవిద్యానివృత్తి
నైన సర్వంబును విస్మయముగ శాస్త్రవిధి నిషేధంబుల నెఱింగి కలలోపల మెలు
గన్న తెఱంగులగు భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడుగ
లవందు బటతతుఁ ద్యేయంబున గార్యకారణంబులందు వస్తువొక్కటియై
యుండునని యెఱింగి యేకత్వాలోచనంబు జేసి వికల్పంబు లేదని భావించుట
భావాద్వైతంబు మనోవాక్కాయకృత్యంబులైన సర్వకర్మంబులు నఫల
భేదంబుఁ జేయక పరబ్రహ్మార్పణంబు జేయుట క్రియాద్వైతంబు పుత్రమిత్ర
కళత్రాది స్వప్రాణులకును దనకు దేహంబునకుం బంచభూతాత్మకత్వం
బున భోక్తయుకరణంబును పరమార్థతత్త్వంబున నర్థకామంబుల యెడ నై
క్యదృష్టి జేయుట ద్రవ్యాద్వైతంబు నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వై
తత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియు స్వకీయ పరకీయ బుద్ధియు నస్వ
ప్నంబుగాఁ దలంచి మునియయిన వాఁడు మానవులయు॥ క॥ పాదములు వేయు
నేటికి। వేదోక్తవిధింబడించు విబుధుండు గృహమం। బాదరమున నారాయణు।
పాదంబులఁ గొలిచి ముక్తిపదమున కేగుఁ॥ శా॥ భూపాలోత్తమ మీరు భ
క్తిగరిమస్ఫూర్తి నెన్నరో జేసినా । శ్రీపాదాంబుజయుగ్మము న్నియతులై సే
వించి కాదే మహా । గ్రావత్సంఘము లోనఁ జక్కనై సమస్తార్థాంతని జేతత
లాము। యేపారంగ ముఖంబు జేసితిరి దేవేంద్ర ప్రభావంబునన్ ॥ వ॥ వినుము
పోయిన మహాకల్పంబునందు గంధర్వులలో నుపబర్హణుండను పేరఁ గంధ

ద్వాండనైన నేను సౌందర్య చాతుర్య మాధుర్యగాంభీర్యాదిగుణంబులనం
దరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలయిన బ్రహ్మలు
దేవసత్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబుచేయు కొఱ
కునప్సరోజనంబులను గంధర్వులం జేసిన ॥ గీ॥ క్రతువులోని కేగ గంధర్వగణ
ములోఁ । గలసిపోయివిష్ణు గాథలచటఁ । గొన్నిపాడి సతులఁ గూడిమో
హితుఁడనై । తలఁగిచనితినంత ధరణినాథ । క । వారిజగంధుల పొత్తున ।
వారింగైకొనఁ దలఁగి వచ్చినబుద్ధి । న్వారెఱిఁగి శాపమిచ్చిరి । వారింపఁగరా
నిరోషవశను సధిపా ॥ గీ॥ పంకజాక్షు నిచట బాడక కామినీ । గుణముగూ
డిచని సకల్మషమున । దర్ధకాంతినగుచు ధరణితలంబున । శూద్రజాతివతికి
సుతుడనగుము॥వ॥అనియిట్లువిశ్వస్రష్టలుశపించిననొక్కబ్రాహ్మణదాసిబు
త్రుఁడనై జన్మించియుందుబ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషణజేసినభాగ్యం
బునని మ్మహాకల్పంబునందుబ్రహ్మపుత్రుండనయిజన్మించితిఁగీ కౌశల ము నమో
ఘగతికిగృహస్థుడే । ధర్మమార్గ చరించితగిలిపోవు । నట్టిధర్మమెల్ల నతివిశదంబు
గాఁ । బలుకఁబడియెనీకు భవ్యచరిత ॥ మ ॥అఖిలాధారుడ జావెమర్త్యభుం
డు బ్రహ్మెబె విష్ణుండనీ । ముఖమందర్శితుఁడై వాస గతుఁడై మాధుర్యసం
భాషితుఁడై । సఖుఁడైచారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై ॥
సుఖదుండ యెవ్వఁడు పన్నగామహిమ దాజోద్యంబు ధాత్రీశ్వరా ॥ వ ॥అనియి
ట్లు నారదుండు చెప్పిన వృత్తాంతంబంతయు వి ధర్మనందనుండు ప్రేమ
విహ్వలుండయి వాసుదేవుని బూజించె నాడు దేవ ధర్మనందనుల చేత
బూజితుండయి నారదమునియు దేవమార్గంబునం జనియెనని శుకయో
గీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పె॥
క॥ రాజీవసదృశలోచన। రాజీవభవాదిదేవ రాజవినుతని । బ్రాజిత కీర్తిల
తావృ రాజీవభవాండ భాండ రఘుకులతిలకా॥

మాలిని ॥ధరణిదుహితృరంతా ధర్మమార్గానగంతా ॥నిరుపమునయ
వంతా నిర్జరారాతిహంతా । దురుబ ధనుఖకర్తా కుభినీచక్రభర్తా ।
సురభయపరిహర్తా సుశ్రితోపిహర్తా ॥

గద్యః ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవిచిత్ర కేసనమంత్రిపుత్రసహ
జపాండిత్యపోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహా
పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్య
కశిపుల పూర్వజన్మవృత్తాంతంబు సెప్పుటయు హిరణ్యకశిపుదితి
సంవాదంబును సుయజ్ఞచరిత్రంబును యమసల్లాపంబును బ్రహ్మవర
లాభ గర్వితుండగు హిరణ్యకశిపు చరిత్రంబును ప్రహ్లాదవి
ద్యాభ్యాసకథయును ప్రహ్లాద హిరణ్యకశిపుసంవాదంబును ప్ర
హ్లాదువచనంబు ప్రతిష్ఠించి హరినరసింహరూపంబున నావి
ర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకభ
యంబిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాదిస్తూయమా
నుండై తిరోహితుండగుటయు త్రిపురాసురవృత్తాం
తంబును ఈశ్వరుండు త్రిపురంబుల దహించుట
యు వర్ణాశ్రమధర్మ వివరణంబును ప్ర
హ్లాదాజగరముని సంవాదంబును నా
రదు పూర్వజన్మ వృత్తాంతం
బును కథలంగల సప్తమ
స్కంధము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు

